# శృంగార పద్యములు

[ పూర్వకవుల విరచితము ]



ప్రకాశకులు:

శృంగారగ్రంథమాల
రాజమహేంద్రవరం.

1950 వెల 0-8-0

# శృంగార పద్యములు

## నాయిక నాయకా వాలికలు



### స్తవము

శ్రీకృష్ణా యదుభూషణా నరసఖా • శృంగార రత్నాకరా
లోక ద్రోహి నరేంద్రవంశదహనా • లోకేశ్వరా దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తి హరణా • నిర్వాణసంధాయకా
నీకును మ్రొక్కెద ద్రుంపవే భవలతన్ • నిత్యానుకంపానిధీ.

ఉ. క్షోణితలంబు నెన్నుదురు • సోకగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికి చంచరీక చయ • సుందరవేణికి రక్షితామర
శ్రేణికి దోయజాతభవ • చిత్తవశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామశుక • వారిజ పుస్తకరమ్యపాణికిన్.

సీ. చేర్పుక్కగా నిడ్డ • చిన్ని జాబిల్లి వే
సిందూర తిలకంబు • చెమ్మగిల్ల
నవతంస కుసుమంబు • నందున్న యెలదేటి
రుతికించిదంచిత • శ్రుతులు నీన
ఘనమైనరారాపు • చనుదోయిరాయిడి
దుంబీఫలంబు తుం • దుడుకుఁజెంద
దరుణాంగుళచ్ఛాయ • దంపునరికట్టు
యింగిలీకపువింత • కొంతులీన
మదవిషత్తులు బోటులై • యోలగింపఁ
బుండరీకాననమునఁ గూ • ర్చుండి మదికి
నింపువేడుక వీణ వా • యించుచెలువ
నలువరాణి మదాత్మలో • వెలయుఁగాత.

# * వర్ణనము *

## నాయికా నాయకా మాలిక

### పురుష వాక్యము

ఉ. స్త్రీలను నమ్మరాదు యిక • చిత్తములోపలి కొందు వేడినన్
ఆరువ దూరునంబడితి • నందరికిన్ పగవాడనైతినే
దైవము నీతో గూడెమరి • దైవమెరుంగును నా మనంబులో
దిగులును దీరదాయెనిక • తొందరపెట్టకు ప్రాణనాయకీ.

చ. నెలతరో నన్నుబాసి మరి • నిద్రయు నీకును నెట్లు వచ్చెనే
మలయుచునున్న నామనసు • మండినమంటయు నీకు ముట్టదో
తొలుతటి ప్రేమలేదు విను • దేవుడు కొంచకపోకపోయెనా
తలగడక్రింద పామువలె • దాపురమైతివి ప్రాణఘాతకీ.

చ. మనసునలేని ప్రేమ బహు • మాయపుమాటలు యెన్నిగల్గినన్
వినయము లెన్నిజేసినను • వేమరు నాదయ నెంచలేవుగా
యినుము కరుంగవచ్చు కదు • కెక్కినయుక్కు కరుంగవచ్చు నీ
మనసు కరుంగజేయ నొక • మందొకటున్నదె నా మనోహరీ.

చ. వలచెడి దోషకారులకు • వైరముయేల విలాసమేల యీ
చెలువముయేల మేలుగల • జీవనమేల యెరింగి యుండియుం
వలచితి మోసపోతి నిటు • వంటి గుణంబని యెంచనైతి నా
తల విధి నిటులాయె • విను దూరగనేలనె ప్రాణనాయకీ.

చ. పదపది నేను విచ్చుటకు • పాల్పడి మోహముతోడనున్న నీ
జడనొకసారి కొట్టుమని • చేతులు పట్టుక ప్రీతితోడ నే
నడుగత యెంత వేడినను • నూరికె యంటివిగాక నీవు నా
యెడ దయలేకపోయెగద • యింక ప్రయోజనమేమి బాలికా.

చ. నలుగురమాటలన్ వినక ‚ నా తలిదండ్రుల నమ్మలేక పె
ద్దలజెప్పు వాక్యముల్ వినక ‚ దైవమునున్ గొలువంగలేక
చెలి విను భక్తి ముక్తియని ‚ జేరితి యింతటి దావవంచు విన్
తెలియక మోసపోతి పర ‚ దేశివి జేస్తివే ప్రాణఘాతకీ.

ఉ. నెలతరో విన్నునమ్మదురె ‚ నీదుకురుల్ కఠినంబులాయె బొ
మ్మలు కడువ్రక్కలాయె ‚ మనసంతయు బల్ చపలంబులాయె గు
బ్బలు కఠినంబులాయె ‚ మరి భావము పరవశమాయె
నాపగల్గబెట్టు దయ ‚ గన్గానవే మది అంగనామణీ.

ఉ. చక్కనిదానవంచు నెర ‚ జాణవటంచు మితారివంచు నీ
కెక్కువ సొమ్ము కద్దనుచు ‚ యింత తృణీకరమేల జేసెదొ
విక్కుకు విక్కకే చెలియ వెన్నెల ‚ తేటకు యుబ్బవచ్చునా
చక్కదనంబు యవ్వనము ‚ శాశ్వతమా ? భువిలోన సుందరీ.

ఉ. వనితా నాకొక ముద్దుగుమ్మ ‚ గలదా వారాంగనా వీధిలో
ధనమున్ గల్గియు తల్లి ‚ లేనిదియుగా దానింటికిన్ కర్తగా
వొవరన్ విధంబులు పెక్కు నేర్చినదిగా ‚ వొయ్యారిగా జాణగా
వయసుం కొంచెము గల్గియున్నదిగా ‚ తావిచ్చు నాకోర్కెలున్.

ఉ. చక్కన్ని వారిలో మిగుల ‚ చక్కని దానవటంచు వూరికే
విక్కుచు విఱ్ఱవీగెదవు ‚ వేషము వేరొకటింతెగాక
నీ చెక్కెర విత్తమందిరము ‚ చెలియల కందరి కొక్కటేగదే
ఎక్కువయేమి ? నీయెడల యేమి విశేషము చెప్పవే చెలీ.

ఉ. చక్కని దానవంచు రతి ‚ సార మెరింగిన జాణవంచు నా
యక్కర దీర్తువంచు నను ‚ హాయిగ కౌగిట జేర్తువంచు నే
విక్కము నమ్మియుంటి ‚ నెడ నీ విటులారడి జేయవచ్చునా
హరిహరి యింతపాపమును ‚ యేమని దూరుదు అంగనామణీ.

చ. సతులను నమ్మరాదు భ్రమ ‚ యింతురు యెంతటి వారినైన
చెల్లింతురు తియ్యమాటలను ‚ వియ్యము వేతురు గారవింతురున్
తొలుతటి స్నేహమున్ గనరు ‚ తోయజగంధులు ప్రాణనాయకీ.

ఉ. చంచలనేత్రి నీ చెలిమి • చేసిన దానికి నీవు మేలు యో
చించక యెంత జేసితివి • యో లలనామణి యేమి జేతునే
పంచశరుఁడు నన్ను బహు • బాధలు బెట్టుచునుండు వేళలో
వంచన యేలనే యికను వద్దను • తీర్చవె ముద్దుకోమలీ.

ఉ. కావలెనంచె నాకు యిక • కంజదళాక్షులు యెందరో భువిన్
నీవు వివేకివంచు రతి • నేర్పరివంచును నిన్నె కోరితిన్
నీదు గుణంబులున్ చెలియ • నీతియువీడి వివేకహీనమై
పోవుట నే నెరుంగవిక • పొందు తలంపను ప్రాణనాయకీ.

మ. తొలుతన్ నందుకు వచ్చినప్పుడుగదా • తోరంపు బల్ శీతోవి
ముఖమున్ జూచియు నేను నాశపడితిన్ • నీవెంత రంగైతివో
చెలియా నీకును బువ్వలేదుగదవే • దారిద్రురాలైతివే
తుదనాచేతిలో దుడ్డులేదుగద నీ • దుఃఖానికి కేమందునే.

చ. కలికిరో నీవు నన్ను మరి • కన్నులజూచిన వేళయెట్టిదో
కలవరమాయె నామనసు • కాయము విల్వదు యేమిచేతునే
కులుకు మిఠారివంచు చను • గుబ్బల గుమ్మెన సొజ్జలన్నియుం
తలచిన గుండెలో దిగులు • దైవమెరుంగును ప్రాణనాయకీ.

చ. పలుకక యేలపోయెదవు • పద్మసుగందిటు మళ్ళిచూడవె
విలువిలు యొక్కమాటవినుము • నీ మది నా మనవాలకించవే
తెలివిలో నన్ను గూడుకొని • నమ్మతి మీరగ పవ్వళించవే
కులుకు మిఠారి నీదు చను • గుబ్బల మెచ్చితి ప్రాణనాయకీ.

శా. ఆకాలంబుననీవు నేను మదిలో • అన్యోన్య సంప్రీతితో
జోకుల్ గూడుట లోకులెల్ల • మది నాశ్చర్యంబుగా జూచిరే
యీ కాలంబున భేదబుద్ధి • మనకున్ యే దేవుడున్ వ్రాసెనో
కాకికోకిల చందమాయె • గదవే కాంతా మన స్నేహముల్.

ఉ.యెన్నిదినాలనుంచి వినుము • యేక్రియనైనను జూచెదనంచు నే
నెన్నుచునుంటి యీవరకు • యెప్పుడు దైవము కూర్చిపెట్టునో
కన్నడలాయె నేటికివి • కామునిమర్దన కోర్వజాలనే చం
ద్రునివంటి నీ ముఖము • యెన్నడు జూచుట భాగ్యమున్నదో.

ఉ. యేలనే యింత వంచనలు • యేలనె జాలము మోహనాంగి యీ
కాలము యిట్లు నుండునటె • కామిని యాచలమేలజేసెదే
గేలవి యెంచబోకు యిది • మేలటె నీకు మనోజ్ఞ కేళికిన్
వేలిన ప్రాణవల్లభువి • యింపుగ జూచుకో ముద్దుకోమలీ.

ఉ. యెన్నడు లేవి వింతయిది • యేమని చెప్పదు మొన్నరాత్రియుం
కన్నులు గప్పినట్లు విగి • కౌగిట నీ యురమానినట్లుగా
వున్నది రాత్రియుం పగలు • వో మధురాధరీ యెట్లువోర్తునే
విన్నెదబాసివచ్చి యొక వత్సర • మాయెనె ప్రాణనాయకీ.

ఉ. చక్కెరవంటి పల్కులతో • చయ్యన వ్రాసిన జాబు చూడగా
యెక్కడలేని భాగ్యములు • యబ్బినయట్టుల నుండెనాకు ఏ
తక్కువ యేమిలే దిలలో • దైవము నామది లోననుండు నీ
కక్కరగల్గి ప్రేమముతో • ప్రక్కకు రావలె ప్రాణనాయకీ.

ఉ. విన్నటిరాత్రి నాకలలో • నీవటు వచ్చియు నాదు శయ్యపై
తిన్నగ పవళించి రతి • క్రీడలు సల్పుచునుండగాను నే
స్తన్యములావి మోవియును చాలగ • గ్రోలుచు నుండునట్లుగా
కన్నియ నేను ఒక్కకల • గంటినె సత్యముగాను కామినీ.

చ. బలుకన్ బంగరు మట్టె లందియలు • గంటిల్ గజ్జలొడ్డాణ
ముల్ బల్ పాట్నీలు కడియముల్ • వత్తులున్ బాజీయు బందుల్
మరిన్ బలుసొంపొందగ పట్టుశీరెయును • మేనన్ దాల్చి నీవె
ప్పుడున్ కలలోరావి దినంబు • లేదుగదవే కాంతా శిరోరత్నమా.

ఉ. ఆరుదినంబులాయెకద • హా సఖి విన్నెడబాసి నేటికిన్
దూరపుసీమ జేరితివి • తొయ్యలి నాకొక జాబువ్రాసితే
నేరమచే విలాసమది • విర్దయురాలను నమ్మరాదుగా
వారిజనేత్రి నీకు పగ • వాదనుగామ త్రిలోకసుందరీ.

ఉ. యెన్నడు జూతునో ముఖము ‧ యెన్నడు కౌగిట జేర్చుకొందునో
యెన్నడు నిన్నుగూడి రమి ‧ యించుట భాగ్యము యెన్నడబ్బునో
యెన్నగస్వాతి చినుకు్లలకు ‧ గాచినముత్యపు చిప్పరీతిగా
నిన్నును జూడగల్గు ఫల ‧ మెన్నటికో మదహంసగామిని.

ఉ. యేమని విన్నవింతు చెలి ‧ యా యిక యేమని వ్రాసిపంపుదున్
నా మదిలోననుండు వ్యసనంబును జెప్పను శక్యమౌనటే
కామునిచేతజిక్కి బహు ‧ కష్టము నొందుచునున్న వానిపై
తామసమేల జేసెదవు ‧ తక్షణమేలవె తోయజాననా.

ఉ. మనసున ప్రేమ లేదికను ‧ మాటలు మాత్రము చాల యున్నదే
దినమును రాత్రియుం పగలు ‧ దీరదు మోహముగల్గె నీదుపై
వనరుహనేత్రి నన్ను యిటు ‧ వంచన చేయుట ధర్మమౌనటే
కనికరముంచి కౌగిటను ‧ గ్రన్నన జేర్చవె కన్యకామణీ

ఉ. యెచ్చటి మాటలే జలరు ‧ హేక్షణ యించుక నీదు చెంగటన్
ముచ్చటలాడ గల్గినను ‧ మూఢునకైనను అన్యకాంతపై
నిచ్చయు బుట్టునే మనను ‧ కింపుగ దోచునె రామ రామ నే
నిచ్చట యొంటిగా దలచి ‧ ఆత్మ దపించెద బాలికామణీ

ఉ. చంచలనేత్రి నాకు గ్రహ ‧ చారము చాలదు దైవయత్నమో
వంచనలేక నన్ను రమి ‧ యించిన వేళలో వర్జముండెనో
పంచశరుండు సాక్షి ‧ గను బాసిననాటికి నేటికింక నా
కాంతుని కేళిలోన రతి ‧ సంగతెరుంగును ప్రాణనాయకీ.

ఉ. చందనగంధి నీకుచము ‧ లందని మామిడిపండ్లుచందమే
చంద్రునిబోలు నీ ముఖము ‧ చెక్కులు జూచిన నిల్వుటద్దమే
యిందుకుసాక్షి మన్మధుడు ‧ యేచగసాగెను తాళజాలనే
చందనగంధి నీ వయసు ‧ చింతలు తాయకె అంగనామణీ.

ఉ. పొన్నసుగంధి నీ ముఖము ‧ పున్నమ చంద్రునివంటి కాంతియుం
కన్నులు నల్లకల్వలును కంఠము ‧ కోకిల కూయుపల్కులున్
పన్నుతమౌ కుచంబులును ‧ చక్కెరవంటిదియు నీదు మోవియున్
యిన్నియుజూచి నేత్రమసి ‧ యే విధ గూడితి భామినీమణీ.

ఉ. స్నేహము చేయరాదు మరి • జేసిన పిమ్మట యెన్ని జేసినన్
బాయగరాదు బాసినను • భావజుకేళి దవాగ్ని లోపలన్
ద్రోయగరాదు ద్రోసినను • ద్రోసినయంత ప్రమాణ వాక్యముల్
నీయగరాదు యిచ్చినను • మీశ్వరుని సాక్షిగ తప్పరాదు
యీ కాయము లస్థిరమ్ములని • గాన దలంతురు ప్రాణనాయకీ.

మ. నను నీవానిగ జేర్చుకో • అధర పానంబిచ్చి పోషించుకో
మనసైనప్పుడు నిన్ను గూడుకొననున్ • మన్నించి లాలించుకో
కులుకున్ గుబ్బల చేర్చుకో • కొసరితే కోపించి రక్షించుకో
నెనరింతన్ కలిగించుకో • కమలపాణీ నీలవేణీమణీ.

మ. ముచ్చటలాడవే పిలచి • ముద్దొకటియ్యవె మోహనాంగి నీ
పచ్చి జవాజి గుబ్బలకు • బాగుగ బూతునె వద్ద జేర్చవే
యిష్టముగాను నీ కౌగిటి • విడియ మిచ్చెద నాదరింపవే
మత్సరమేల జేసెదవె • మాటికి మాటికి హంసగామినీ.

ఉ. నిన్నను జూచి నేటికిని • నెలలును దినములు మూడు నాయనే
సన్నపు నడుముదాన యిక • చక్కని నీముఖమైన చూపవే
కన్నెరొ నేను వచ్చితిని • కౌగిటజేర్చి నన్నాదరింపవే
పొన్న సుగంధిరో వినుము • పుణ్యము నీకును రంగనాయకీ.

ఉ. సుందరి వౌదువే చెలియ • చూపున రూపున లేఖలన్నియున్
కుందన బొమ్మవే చెలియ • కుంకుమ రేఖల మోహనాంగివే
యెందరి స్త్రీల జూచినను • యెవ్వరు నీసరి తూగజాలరే
కందువ అణిముత్యముల • కులుకుల రంభవె నామనోహరీ.

ఉ. యెక్కడి మోహమే చెలియ • యేమియు తోచక నున్నదే సఖి
అక్కరతోడ నాదుమరి • చెక్కిలి నొక్కవె పక్క జేరవే
మక్కువతోడ నీదుకుచ • కుంభములన్ మరి నాదు రొమ్మునన్
గ్రుక్కనజేర్చి మేలురతి • చక్కగ నాయవె సరసవల్లభీ.

ఉ. మోమును కన్నులన్ నాసలు • ముక్కును చెక్కిలి చౌలు
దంతముల్ కోమలమైన వెంట్రుకలు • గొప్పకుచములు నీదు
పాదముల్ సామజయాన నీ వగలు • చక్కని పల్కులు కుల్కు
లన్నియుం యీ మహిలోన నీకు సరి• ఇంతివిగానవె నెంచిచూడగన్.

ఉ. చిత్తిని జాతివంచు గుణ • శాలివటంచు నే నమ్మినందుకే
నిత్యము నీతోగూడి రమి • యించుట భాగ్యము లేకపోయెనే
ముత్యమువంటి పల్వరుస • ముద్దుగ జూచితే మోసమొచ్చునా
సత్యముగాను నా మనసు • నైచక యున్నదె సరసవల్లభీ.

చ. జూచితె విద్యాధరాంగనల • సుందరి నింద్రుని రాణి జూచితిన్
జూచితె నాగకన్నియల • సుందర రూప విలాస వైఖరుల్
జూచితి రోహిణీ రతిని • జూచితి అప్సర స్త్రీల నందరిన్
జూచితిగాని నీకు సరి • సుందర రూపము లేదు వారికిన్.

శా. బాలా నీ మృదు పల్కులన్ వినగ నా • భావంబు నీరయ్యె నా
లోకించిన నాదు జూపులకు • నానందంబు వర్ధిల్లె నీ
లీలోద్యాన విహారమున్ గని వహా • శిన్ జెందె నా చిత్తమో
లోలాక్షీ నను కామబాణములకున్ • లో జేయకే వేడెదన్.

చ. శంబరవైరి వేదనకు • శక్యముగాదు మనంబునిల్పగా
నంబుజనేత్రి నీదు యధ • రామృత పానము జేయకున్న ప్రా
ణంబులు దక్కనేరవని • నాహృదయంబునదోచె నన్ను ప్రే
మంబుతో నేలవే రమణి • మాటలతోఁ,క జాగుశాయకే.

చ. గులుకులమిఁటారి పీటవు • గుబ్బలు నాయెదనుండి వేడ్కతో
వలపు కౌగిలన్ బిగిచి • వాతెర నొక్కుచు ముద్దులిచ్చి చె
క్కిలిగిలబుట్టి నామదికి • గ్రక్కున సంతసమంద జేసినన్
చిలుకపలాకి రౌతునొక • చీరికి గొందునె హంసగామినీ.

ఉ. యెక్కడ బోయివచ్చినను • యెవ్వరితోడుత మాటలాడినం
యెక్కడ వర్ణించినను • యేమివిచిత్రమొ మోహనాంగి నీ
చక్కరమోవిమీదనె • విచారముగాని మనంబులోపలన్
దక్కిన చింతలేదు • మరి దైవము సాక్షిగ ముద్దుకోమలీ.

ఉ. మోహము దీరదాయెగదె • మొన్నటిరాత్రియు నీవు నాకలన్
వచ్చియు లేవనెత్తుకొని • వస్త్రపు గుబ్బలు నాదురొమ్మునన్
గ్రుచ్చియు కౌగలించుకొని • కోరికదీర రమించినట్లుగా
కలగని మేలుకొంటి వినుగావక • నే పరితాపమొందితిన్.

ఉ. తథ్యము రాత్రియుం బగలు • దైవముసాక్షిగ నీదుచింతచే
నిద్దురరాదు కన్నులకు • నిక్కముగా తలిదండ్రి సాక్షిగా
కద్దనినోము నోచితినో • కాంతరో పూర్వమునందు అయ్యయో
యిద్దరిపాపమా యికను • యేమని చెప్పుదు ప్రాణనాయకీ.

— * —

## నాయికా ప్రణయ మాలిక

సీ. ఇంపుతోడుత నాథు • డింటికి వచ్చితే
సేతుయాత్ర • ఫలంబు సిద్ధిగల్గు
నామీది చమటలు • నీమీదసోకితే
కాశిగంగాస్నాన • ఫలముగల్గు
అన్నంబు ముట్టక • అధరపానముజేస్తే
ఛామయేకాదశి • ఫలముగల్గు
రాత్రి నిద్రయులేక • రతికేళి సల్పితే
శివరాత్రి సత్ఫల • సిద్ధిగల్గు
గుబ్బలంటితె వుపవాస • ప్రసక్తిఫలము
వలచి సరసంబులాడితే • అధికఫలము
వలచి ముద్దిస్తె • శ్రీరామనవమిఫలము
నన్నునేలితే • అనంతకోటిఫలము.

సీ. ఒక్కనాటికినీవు • ప్రక్కనుండితెచాలు
దేవేంద్రపదవి • సిద్ధించినట్లు
ఒక్కరేయి నీతోను • వెనగిగూడితెచాలు
బ్రహ్మపట్నంబు • చేపట్టినట్లు
క్షణమైన నీతోను • సరసమాడితెచాలు
యీరేడు లోకంబు • లేలినట్లు
నిమిషంబు నీతోను • రమియించితేచాలు
రాజాధిభోగంబు • లబ్బినట్లు

వాలుకరగించి • సొక్కించి వలపుజూపి
పూవి చెక్కిలి • నొక్కియు ముద్దుబెట్టు
ఖాసురవిలాస • పొన్నేరిపురనివాస
పాహి శ్రీకృష్ణ • జగదీశ పరమపురుష.

సీ. ఏమిరా నాసామి • యింతకోపము దేల
తాళరా తాళరా • తాళకోర
చిన్నప్రాయమునుండి • చేరియున్నానురా
యెంతైన నీ • మనసేలరాదు
నిన్నునమ్మినదాన • నేనేమి సేతురా
నామనసు నొచ్చేది • న్యాయమటర
తెలియక నేనుజేసిన • తప్పులన్నియు
యెంచవద్దుర నీవు • యెమ్మెకాడ

స్వామి యిన్నాళ్ళు • నిన్ను నమ్మియున్నదాన
చలముజేసేది • యిక నీవు తాళకోర
చందనాచల వాసుడా • షణ్ముకేశ
సుందరాకార • చెన్నూరి సుబ్బరాయ.

సీ. యేమిరానాసామి • యేలమాట్లాడవు
కోపంబుజేసేవు • కోమలాంగ
సరసంబులాడరా • సైగలుశాయరా
చేకొనియుండరా • శేషశయన
మనమిద్దరమెగాని • మగువలెవ్వరులేరు
మాటలాడవదేర • మదనరూప
పూలచెండ్లాడరా • పాన్పుపైయుండరా
కోర్కెనుదీర్చరా • కోడెకాడ
నమ్మినానుర నిన్ను • నే నమ్మికొంటి
గౌరవంబున నీతోడ • కలసియుంటి
స్వామిసాక్షిగనిన్ను • నే కోరియుంటి
మనసు నామీద • యుంచరా మదనజనక.

సీ. పిలుపుపిలువగనీవు • పలుకవదేమిరా
పగదానరానీకు • ప్రాణనాథ
యిన్నాళ్ళవలెనీవు • యింటికేటికిరావు
నిన్ను నేమంటిరా • నీటుకాడ
నీవు చెప్పిన పనుల్ • నే చేయనంటినో
కపటంబుమానరా • కలికిజాణ
వలపు తలకెక్కెరా • వలరాజుసాక్షిగా
రవ్వసేయకుమింక • రవినితేజ
నిన్ను యెడబాసి నిమి • షంబు నిల్వలేను
వుదర చిలుకలర • నుశికి నోర్వలేను
మరియు స్త్రీహత్యచేయ • ధర్మంబుగాదు
పంతమేటికి నాపయి • ప్రాణనాథ.

సీ. కోమలాంగుడవీవు • కొనియాడియుండగా
గుబ్బలు బట్టరా • కుదురుగాను
మదనాంగుడా నీవు • మొగమెత్తిచూడరా
పరస్త్రీవిగాసురా • పద్మనాథ
భూమిలో స్త్రీలను • పొందియుంటివిగాని
నావంటిదానితో • పొందగలవ
నావంటిచిత్ర యీ లోక • మందునలేదు
వెయ్యేండ్లు వెదకినా • చూడలేవు
నిన్నుబోలిన పురుషుల • బొందలేదు
నన్నుబోలిన స్త్రీలను • జెందలేవు
యెందుకిక పురుషజన్మ • మెత్తినావు
నిన్ను పుట్టించి దైవంబు • నిందపడియె.

సీ. మొగమెత్తిచూడరా • ముద్దునాకివ్వరా
ముచ్చటలాడరా • మోహనాంగ
ప్రాయంపుదానరా • పంతంబులేలరా
పగవద్దు నామీద • ప్రాణనాథ
నెరజాణయేమిరా • నినుబాయజాలరా
నేరంబులేలరా • నీటుకాడ
నమ్మినదానరా • నగుబాటులేలరా
నామీద దయయుంచు • నెమ్మనమున
వలపు హెచ్చెను • తాపంబు నిలుపలేను
నీవు క్రీగంట జూచేది • నీతిగాదు
వెతల బెట్టకు నావంటి • సతినిగూడ
చేరిమ్రొక్కెదరావయ్య • జీవితేశ.

సీ. విడెము జుట్టిత్తున • వీణవాయింతునా
గా త్రైన పడుదునా • కంబుకంఠ
మంచంబువేతునా • మరుకేళికొ త్తునా
కస్తూరిబూతునా • కమలనాభ
పాట పాడింతునా పువ్వులు • ముడుతునా
సరసంబు చేస్తునా • సరసనయన
అద్దంబు తెత్తునా • ముద్దు నీకిత్తునా
వద్ద పవళింతునా • వారిజాక్ష
యేమి వూడిగముల వేతు • సామి నీకు
నీవు బెట్టిన మరులు నే • నెట్లు మరతు
ఆశ ఆశలుబుట్టి నా • యెమ్మెకాడ
మోహ మెక్కుడదాతురా • మోహనాంగ.

సీ. సఖులార వినరె నే • సమ ర్తాదినది మొదల్
చక్కని నా ప్రాణ • సన్నుతాంగు
నెదబాసి వొంటిగా • నొక్కనిమిషంబు
నిద్రింపకుంటి నే • విపుడు వాడు
టక్కులాడి వలలొ • జిక్కెనో మరిలేక
యెక్కడి కేగెనో • నెరుగనమ్మ
విటుకావివదలి నే • నెటులోర్చి యుందునే
పటుతరంబైన యీ • ప్రాయమందు
మరుడు యురమున శరములు • కురుగాను
గురియుచున్నాడు • గావున వేగనాదు
నరస నావిభు • నాచెంత జేర్తురనుచు
చాలవేడెద నో • చానలార మిమ్ము.

సీ. కస్తూరి తిరుమణి • కరిగి యుండదమేమి
కన్నుల యెరుపేమి • కంబుకంఠ
గుబ్బల బోటేమి • కుంకు మాంకితమేమి
గోళ్ళ గాయంబేమి • కోమలాంగ

## శృంగారపద్యములు

మాట తప్పితేమి • మనసు చంచలమేమి
దోవతి వలుపేమి • తోయజాక్ష
యత్యంత శ్రమయేమి • యధరంబు తెలుపేమి
శిఖ వీడినది యేమి • శేషశయన
యిట్టి లక్షణ మే వనితచే • విపుడు గలిగె
దాని పేరేమి చెప్పరా • దాచకుండ
చెప్పకున్నను విడువను • సిగ్గుదీతు
పరమ శ్రీరంగ పురవాస • ప్రాణనాథ.

సీ. చల్లని పన్నీరు • చల్లించుకొన్నను
అణగదే మదన • విరహాగ్నియేమొ
మంచి చందనము • పూయించు కొన్ననుగాని
తొలగదే యీ • దేహ తాపమేమొ
కలకండ పొడి • పానకంబుచేసి త్రాగినా
తీరదే మదన • దాహంబదేమొ
విమల వీవనలతో • విసరించుకొన్నను
విడువదే మరువి • యా విరహమేమొ
యెటుల నేసైతు యీ • విరహ బాధ కిపుడు
విభుని వేగమె • రప్పించరమ్మ నాదు
పటుతరంబైన • ప్రాయంబు పతనిపోవు
చిన్నదానను • తలిరు పూబోణులారా.

సీ. రేపగల్ దావిల్లు • కాపురంబై యున్న
విభుని నేమందునే • కన్యలారా!
వచ్చినప్పుడెవాని • వలపించలేని
నాబుద్ధి కేమందునే • పొలతులారా!
తలవ్రాత తప్పింప • దైవంబు వశమౌనె
యవరినేమందునే • యింతులారా!

పదతి నీచిత్తమింక • నాభాగ్యమమ్మ
యేమిసేయుదు యీ • విరహ మెటులనైతు
వనిత నీవేగి మోహనా • కారునిటకు
తోడుకొని వేగ • రాగదే తోయజాక్షి.

సీ. సిగజారు పూలేమి • చిగురు గంధములేమి
కన్నుల యెరుపేమి • వన్నెకాడ
పలుకెంపు మోమేమి • పసుపు దుప్పటియేమి
విదుర మబ్బేమిరా • నీటుకాడ
చెక్కిట గోరేమి • చుక్కజవ్వాజేమి
యెదగుబ్బపోటేమి • యెమ్మెకాడ
సొలపుల నడుపేమి • పలుకు కబ్బిబ్బేమి
విడెము పొక్కిటదేమి • వింతకాడ

పరవశంబేమి నాతోను • పంకజాక్ష
రాత్రి యేవనిత గూడితో • రమ్యముగను
వనిత దామోదరాచ్యుత • ప్రణుతకృష్ణ
రమ్యగుణధామ • కావేటి రంగధామ.

సీ. కందర్ప నీ మోవి • గాయము లేమిరా
నిజముగ జెప్పరా • నీలవర్ణ
కంజాక్ష నీమోము • కాటుక రేఖేమి
బొంకక జెప్పరా • పూర్ణచంద్ర
గంభీర నీమేన • గంధంబు బూసిన
దానిపేరేమిరా • దీనవరద
యే పద్మావతితోను పెనగి • యున్నావురా
పసుపింతయా యేమి • పద్మనాభ

కంటి కంటిర జగతి • లోకంబు కంట
అన నవశ్యము లేదాయె • అందకాద
యెన్ని మాటలు నేర్చితో • వెన్నదొంగ
వేణుగోపాల నీమహి • వింతలాయె.

సీ. మధుర వాక్యము జూపి • మరిగితినేకాని
కరకంతుడనుచు • నే నెరుగనైతి
దయగలవాడవి • నిలచి యుంటితికాని
యెంగిలి ముచ్చవి • యెరుగనైతి
సద్గుణుండంచు నే • చాల నమ్మితిగాని
దుర్గుణుండంచు నే • నెరుగనైతి
పరసుండవనుచు నే • సరసజేరితిగాని
స్త్రీద్రోహుండనుచు నే • నెరుగనైతి
జార చోరుడ నీ • యింద్రజాల మహిమ
యిట్లు దెలియక నే • చాల మోసపోతి
అమ్మ నే జెల్ల మొగవారి • నమ్మరాదు
యింత పరాకేల • నీకు గోపాలబాల.

సీ. వగలాడి వేసిన • వలపు జిక్కినవాడు
యటకు రానేర్చునా • యింతులారా!
పాపంబు జేసిన • పాపాత్ముకాలికి
దక్కునా ఆలవాడు • తరుణులారా!
దైవంబునకు యేమి • దయదప్పి యుంటినో
చలము సాధించెనే • సఖియలారా!
వాడన్న పనియేమి • వనిత బెట్టినమందు
మాయ జేసినదింత • మగువలారా!
యింత కెడమాయ • విధివశం బేమి మాయ
మరుడు విసుబాయ • కెద దూర శరమువేయ
వేగమున విందు రాదాయ • యేమివేయ
యేమొ తెలియంగ రాదాయె • విభువ మాయ.

సీ. నిమిషంబు నొకచోట • నిలువ నేరనివాడు
నీలవేణుల యిండ్ల • నిలువనేర్చె
పలుమారు నొకరితో • పలుకనేరనివాడు
పల్లవాధరులతో • పలుకనేర్చె
కలనైన నాయింటి • గడప దాటనివాడు
పొలతుల యిండ్లకు • పోవనేర్చె
పాన్పుపై నను బాసి • పవ్వళించనివాడు
భామల కౌగిట • పండనేర్చె
తలచ నేటికి తొల్లింటి • దయలు దప్పె
విభుడు నానాటి కిటువంటి • విధ మెరింగె
వనిత నీవేగి శ్రీశైల • వాసుడైన
మల్లికార్జుని దేగదే • మధురవాణి.

సీ. విరహతాపంబాయె • విభు డిటు రాడాయె
విరహాగ్నికిని తాళ • ఇందువదన
వెన్నెల [illegible]మాయె • విరిసరుల్ వెగటాయె
నిద్దుర లేదాయె • ముద్దుగుమ్మ
హర్షంబులేదాయె • నాడికల్ విడుపాయె
నిద్దుర కెరవాయె • నీలవేణి
సవతి పెట్టిన మందు • తలకెక్కె యెపుడైన
జేరి నాయింట • నిలువడాయె
పగలు రేయును • దానింట పండనాయె
నెలత నాపొందు • మదిలోన వెన్నడాయె
వనిత నీవేగి • మోహనాకారునిటకు
తోడుకొని వేగరాగదే • తోయజాక్షి.

సీ. కస్తూరినాకేల • కాంతాలలామరో
చెలికాడు కోపంబు • చేసినాడొ
గంధమేటికినాకు • కాంతాలలామరో
నేడు యెవ్వతె పొందు • గూడినాడొ
విడెము నాకేటికి • విద్రుమాధరి నేడు
అతఁడు నామీద • యలగినాడొ
పొమ్మేల విరులేల • సొగసేల యీవేళ
వెలదిరొ యీవేళ • విభుడురాడొ

అతడు రాకున్న నేనెట్లు • నోర్చియుందు
అలుగతప్పేమి జేస్తినో • అడుగరమ్మ
రామ నీవేగి మోహనా • కారువిటకు
తోడుకొని వేగ రాగదే • తోయజాక్షి.

సీ. మోహనాకార నీమోము • జూచితెచాలు
సొగసైన చంద్రుని • జూడనేల
మదనావతార నీ పెదవి • యానితెచాలు
ఖండశర్కర • పానకంబులేల
శృంగారమూర్తి నిన్ • చేపట్టితెజాలు
యరుదైన తామర • లంటనేల
కందర్పజనక నిన్ కౌగి • లించితెజాలు
మన్మథ కేళిలో • మరుగనేల

కరుణగలిగియు నాతోడ • గలసినీవు
మెలగినదిచాలు యిక నిన్ను • మరచియుండ
ప్రాణనాయక కాయజు • శరములకును
బాధపడజాల ప్రాణ • ముల్ విడుతునిపుడు.

సీ. భామరో నేనొంటి • పాన్పుపై పవళించి
నిదురబోవుచునున్న • నిన్న రేయి
కలలోన చెలికాడు • కౌగిటలోజేరి
కమ్మవిల్తుని • కేళిగలపె నన్ను
మరికొంత తడవుకు • మగువ నేమేల్కాన్న
యెదుట లేడాయెనే • యెమ్మెకాడు
యెంత పాపపునిద్ర • యింతి యీ వేళనే
నెక్కడ కలగంటి • నేమిసేతు

మమత బుట్టించె • మన్మధ మాయగాక
చెలువుడిందేలవచ్చునే • జలజగంధి
చెలియ నీవేగి • మోహనాకారునిటకు
తోడుకొని వేగరాగదే • తోయజాక్షి.

సీ. తొయ్యలి ప్రాణేశు • తోడ్కొనివచ్చితె
రాగిడినీకిత్తు • రాజవదన
ఫాలాక్షుడిపుడు • నా ప్రక్కకువచ్చితె
చిన్నసరంబిత్తు • పద్మనయన
పతినాదు కెమ్మోవి • పంటితో నొక్కితె
సందియబొందిత్తు • హంసయాన
గుబ్బపాలిండ్లపై • గోరులుంచితెచాలు
బంగారు గుండ్లిత్తు • పడతి నీకు

వాడు మరుకేళిలోనన్ను • పోడిమరల
గూడితే నీకు మణిధన • కోట్లనిత్తు
వనిత నీవేగి మోహనా • కారునిటకు
తోడుకొని వేగరాగదె • తోయజాక్షి.

సీ. చలువ చప్పరములో • సరసు డాక్కొనకవేళ
చదరంగ మాడించు • చందముగను
బంగారు మేడపై • ప్రాణేశు డాకవేళ
పగడశాలాడించు • ప్రౌఢిమిగను
చిత్తరుచవికతో • చిత్తేశు డాకవేళ
చిత్రముగ నాడించు • జూదగాను
సంతోషకరమైన • శయ్యగృహంబున
శయ్యాట లాడించు • నెయ్యముగను

యెన్ని విధముల • తానేలుచున్న విభుడు
రమణులను గూడి • సరసకు రవ్వజేసె
భామ నీవేగి • మోహనాకారువిటుకు
తోడుకొని వేగరాగదే • తోయజాక్షి.

సీ. చెలికానిగూర్చి • నాజీవంబు నిలపవే
పుణ్యంబుగాదటే • పువ్వుబోణి
నాతి నాప్రియునితో • నాకునని చెప్పవే
జాగేల జేసెదే • జలజగంధి
వలపు పుట్టించవే • వడని రప్పించవే
చలము సాధించకే • సన్నుతాంగి
మదితాప మణచవే • మగని రప్పించవే
మనవాలకించవే • మందయాన

విరహమగ్గలమాయెనే • విద్రుమోష్ఠి
జీవితేశుని ననుగూర్చు • చిగురుబోణి
పగలు రేయును విరహ • మేర్పరుపరాదు
రాజగోపాలు రాడాయె • నేమిసేతు.

సీ. ప్రాణేశు కౌగిట • పవళించినట్లుగా
కాంతరో నే • కలగంటినమ్మ
అలుక దీర్చుచు • చెక్కిలరిమి ముద్దిడి మ్రొక్కి
కడువేడెనని • కలగంటినమ్మ
గబ్బిగుబ్బలగ్రుమ్మ • గాఢా రతులనుగూడి
తలలంచెనని • కలగంటినమ్మ
కమ్మవాతెరపంట • కసిదీర నొక్కగా
నలిగితినని • కలగంటినమ్మ
ఎన్న డిటువంటి కలలు • నే నెరుగనమ్మ
యెచట నున్నాడొ రాడాయె • నేమిసేతు
చెలియ నీవేగి మోహనా • కారునిటకు
తోడుకొని వేగరాగదే • తోయజాక్షి.

సీ. ఏలాగు తాళుదు యీ • విరహబాధకు
అలనాడు నను మరచి • పోయెనేమొ
యేనాసవతి వాని • కేమందు బెట్టెనో
యేమిసేయుదునమ్మ • వానికిపుడు
వానితో కూడిన చెలి • యొక్కనాడైన
వదలదు వానిని • వసుధయందు
అట్టి సరసునిబాసి యీ విరహ • సమయమం
దెట్లోర్చియుందు • యీ ప్రాయమందు
ఇందువదనుడు యెందైన • నున్నయడల
వందనముఁజేసి వేగ • నా విభుని యిటకు
పొందుగావచ్చి ముఖ • మైన చూపి మరల
పొమ్మనుచు చెప్పి రారె • యో పొలతులారా.

సీ. అతివరో నానాధు • డలగిన నేరంబు
వినవమ్మ చెలులారా • వినులలర
హంస తల్పమునందు • అతడు నేనును
సల్లాపమునున్న • సమయమునను

ముత్యాలు చెక్కిన ముక్కు • ముంగరపైని
మోహంబు ననయేను • మోహనాంగి
కొని తెమ్మటని నేను • కోర్కెతో నడిగిన
అది మొదల్ కోపించి • నమ్మజెల్ల
ముక్కు ముత్యంబు లడిగిన • నేరంబు మోపి
అతడు మూణ్ణెళ్ళు గావచ్చె • రమణి వినవె
అతివ నీవేగి త్యాగేశు • నలుకనేర్చి
వేగ తోడుక రారమ్మ వెలదులారా.

సీ. సఖియరో నాపతి • సంశయంబును మాని
రాదేమిసేతునే • రాజవదన
చెలియరో యీవేళ • చెలికాని తెచ్చితే
చానరో నావన్ని • సరములిత్తు
వగకాని యీవేళ • వదలక తెచ్చితే
కలికిరో పౌజుల • కమ్మలిత్తు
మొగమిచ్చి నాతోను • ముచ్చటాడించితే
ముత్యాల సరములు • ముదితయిత్తు
నెన్ని సొమ్ములనైన • నే నిత్తునీకు
నాపతిని జూపివంతనే • నయముమీర
విరహవేదన దీరునే • విదృమోష్టి
రాజగోపాలు రాడాయె • యేమిసేతు.

సీ. ఏల పుట్టించెనో • ఆపాపదైవంబు
ఆడదానిగనన్ను • అవనియందు
పుట్టిన విష్టమా • పురుషునితో నేను
భోగించునట్లుగా • యుండవలెను
ఉన్న కాంతునితోడ • యెన్నెన్నొవిధముల
సరసమాడుచు • క్రీడ సల్పవలెను
అరీతిగానున్న అంద • గాడిపుడు వా
డేయింట నున్నాడో • యేమిసేతు




వాని యెదబాసియుండ • నావల్ల కాదమ్మ
జాను డిచ్చట రానున్న • దానలార
ప్రాణమేల • రత్నాల భరణమేల
నా మనోహరుని • రప్పించరమ్మ నేడు.

సీ. ముదమున సామికి • మ్రొక్కితినవితెల్పి
శీఘ్రమున • నా యిల్లు జేరుమనవె
ఇందు వసించుట • కిచ్చలేకుండెనా
ఈ రేయి రతిసుఖ • మియ్యమనవె
రతిసుఖంబిడుట • కా రమణుడు వెరచెనా
ఇంపుగా నను • కౌగలింపుమనవె
ఇంతమాత్రంబునను • భయమందెనేని
మోమునైనను చూపి • పొమ్మనవె నేడు

రామ నీవేగి మోహనా • కారువిటకు
తోడుకొని వేగ రాగదే • తోయజాక్షి.

సీ. అడవిలో నొక వృక్షమై • పుట్టగవచ్చు
పుడమిని యాడుదై • పుట్టరాదు
కడు పెద్ద చక్రాంతిగా • పుట్టవచ్చునుగాని
పుడమిని యాడుదై • పుట్టరాదు
పక్షులై మృగములై • పరగ పుట్టగవచ్చు
పుడమిని యాడుదై • పుట్టరాదు
పక్షులై పలుమారు • బొదిలి పుట్టగవచ్చు
పుడమిని యాడుదై • పుట్టరాదు
ఆడజన్మంబు సకలాప • దాలయంబు
పురుషులను గూడియుండని • పుట్టుకేల
కలికి నీవేగి మోహనా • కారువిటకు
తోడుకొని వేగరాగదే • తోయజాక్షి.

సీ. తిలకంబు తీర్చగా • దిద్దనేరనివాడు
బిగ్గగా సొగసులు • పలుపనేర్చె
పతివల యెదుట • మాట్లాడనేరనివాడు
ఎడబాటునను • జతు లాడనేర్చె
పొద్దు కోపించ • యెంచనేరనివాడు
మిన్నక నలుకల • మెలగనేర్చె
లీల నొంటిగ • పవ్వళించ నేరనివాడు
తెగువతో రేలొంటి • యటుగనేర్చె

నెవతె నేర్పెనో • నే జెల్ల నేమిసేతు
మందు తలకెక్కె • యల నాతి మరికినాడు
యతివ నీవేగి • త్యాగేశు నలుకదీర్చి
వేగ తోడుక • రావమ్మ వెలది నీవు.

సీ. పణతి నవ్వినయంత • పద్మము ల్వికసించె
కాంత మాట్లాడగా • గాలివిసరె
వెలది తొడిగినయంత • వెంటనే యురిమెను
జలకమాడినయంత • తొలకరించె
మగువ పావడగట్టె • మధ్యాహ్నమాయెను
కలికి తిలకము • దీర్చ కళలుబుట్టె
బోటి పువ్వుల దురుమ • ప్రొద్దు చల్లగవ్రాలె
పొలతి కాటుకదీర్చ • ప్రొద్దు గ్రుంకె

రవిక తొడగిన యంతలో • రాజు వెడలె
కోక గట్టిన యంతలో • కోడిగూసె
భామ విడెము వేయగ • చందమామ యేగె
తరుణి గంధంబు బూయంగ • తెల్లవారె.

ఒకవేళ చెలికాడు • శుకవాణి రమ్మని
చేసైగ కనుసైగ • చేసునమ్మ
ఒకవేళ నా విభు • దొప్పైన పలుకుల
మాటాడుమని • ప్రతిమాలునమ్మ
ఒకవేళ నాపతియొద్ద • బండవే యని
వేమారు నను • గారవించునమ్మ
ఒకవేళ నా ప్రియు • మొనరగా మరుకేళి
గూడవే యని నన్ను • వేడునమ్మ

చిన్ననాడెల్ల నీలాగు • వన్నెకాడు
తెరిలి బలుకుచు వెనువెంట • దిరిగెనమ్మ
యెచట నున్నాడో రాడాయె • నేమిసేతు
రాజగోపాలు దేగదె • రాజవదన.

సీ. వారకాంతలగూడి • వచ్చేటి ప్రభువుల
వైనంబు జెప్పెద • వరుసగాను
సరిగె పాగలుజుట్టి • చొక్కాయిలును దొడగ
సరిగె దోవతిగట్టి • సొంపుమీర
స్నేహితులతోగూడి • సాహసంబునవచ్చి
అత్తరు వాసనల్ • చిత్తమలర
నెలకు పదిమాడ • నీ కిచ్చెద నటంచు
నిజముగా మాట్లాడి • నేర్పుతోడ

అనుచు యీ రీతి మెప్పింతు • రమ్మచెల్ల
ఆశ ఆర్నెలలు మోహంబు • మూడు నెలలు
అయిన పిమ్మట అన్నంబు • వెగటు పరచి
శీఘ్ర మెగవేసి పోదురే • సిగ్గులేక.

సీ. తొలినాటి మోహంబు • తోచదో మరునాడు
వేరేగుణంబేల • వెలయునమ్మ
వారి వారక్కరల్ • తీరినందాకనే
ఎన్నెన్నొ బాసలో • యిత్తురమ్మ
ఆవెన్క తమపనుల్ • అన్ని దీరినపైన
చులకదనంబుగా • జూతురమ్మ
వానికి దాటిన దాకనే • మోహంబు
యటువెనుక • చింతయే నాస్తియమ్మ

యిట్టి మొగవారి • గుణములు యెన్నవశమె
మనసు నొకమాట • వాక్కున నొక్కరీతి
గడప తగువారు • మొగవారు పుడమియందు
సతుల బ్రతుకేటి • బ్రతుకమ్మ సరసిజాక్షి.

సీ. కురులు నున్నగదువ్వి • కురుచగా జడవేసి
గేదంగి రేకుల • గట్టునమ్మ
తొడపై గూర్చుండ • తోరంబు కస్తూరి
తిలకంబు చక్కగా • దిద్దునమ్మ
కుచ కుంభములపైని • కొంగును దొలగించి
నెలవంక చంద్రుని • నిలుపునమ్మ
తాళరా నిమిషంబు • తరి తీపు లేదంటె
కోకముడి వదలించ • బోవునమ్మ

నట్టి ప్రాణేశు చిత్తంబు • నలుకబూని
నాధుడేరీతి నున్నాడో • నన్ను బాసి
చంద్రగిరివాస భువన • రంజన విలాస
క్రూర దానవ • గజసింహ నారసింహ.

సీ. చిన్నవాడవు నీవు • చిన్నదానను నేను
మనసేల లేదురా • మదన జనక
మనమిద్దరమెగాని • మగువలెవ్వరులేరు
కరుగదా చిత్తంబు • కమలనయన

వద్దికి మారురా వసర • నీ మోహంబు
కన్నెత్తి చూడరా • సన్నుతాంగ
పరకాంత యని నన్ను • పాటింపవచ్చునా
యిల్లాలు నేనుగా • ఇందుహాస
తెంపునను నీవు కెమ్మోవి • తేనెలిచ్చి
ముద్దుబెట్టర యిప్పుడు • మోహనాంగ
సరస వేంకటగిరి విహార • చతురహాస
నిమ్న గుణగణ వినర • ప్రద్యుమ్నబాల.

సీ. నను విడనాడేది • న్యాయమా నావల్ల
నేరమేమెంచితి • నీటుకాడ
నీవు దైవమటంచు • నిన్ను నమ్మితిగాని
యితరమేమెరుగను • యెమ్మెకాడ
విడనాడి నన్నింత • వెదనొంద జేసేది
సంతమా యిది నీకు • ప్రాణనాథ
యింటిలోపల రాకయుంచె • నా ప్రాణముల్
చిక్కియుం తడవు • నిపుడు జీవితేశ

యనుచు నా ప్రాణవిభునితో • నమవుగాను
కూడి పడకటింటిలో • పండుకొందునమ్మ
వనిత నీవేగి మోహనా • కారువిటుకు
తోడుకొని రాగదే • తోయజాక్షి.

సీ. తలముట్టి యెన్ని • బాసలు జేసినగాని
యమ్మమ్మ పురుషుల • నమ్మరాదు
నెయగార వగలచే • నిలబెట్టుదురుగాని
యమ్మమ్మ పురుషుల • నమ్మరాదు
పట్టి దురాశల బెట్టి • పోదురుగాని
యమ్మమ్మ పురుషుల • నమ్మరాదు
వలపించి సతులను • వశము జేతురుగాని
అమ్మమ్మ పురుషుల • నమ్మంగరాదు

మాతన ప్రియులగువారి • రీతులెల్ల
బుద్బుదంబులు వినిపింప • బూటకములు
రామ నీవేగి మోహనా • కారువిటుఁ
దోడుకొని వేగ రాగదే • తోయజాక్షి.

సీ. భానువారమునాడు • పతిగూడి సతులకు
భానందు సిరులిచ్చు • భానురాంగి
ఇందువారమునాడు • యింపుతో గూడిన
ఇంద్రుడిచ్చును • వాని మందిరంబు
భౌమవారమునాడు • ప్రాణేశు గూడిన
బహురోగ వర్జితా • మానుదాన
సౌమ్యవారమునాడు • సొంపుతో గూడిన
సోమిందు మన్నించు • సుందరాంగి

గురుని రమింతు రెప్పుడు • గురుని వార
మందు భృగువార మందున • పొలుపు మీర
మమత హెచ్చును • మందవారమునాడు
మరుని కేళికి రప్పించు • మగువ నీవు.

సీ. యేమె వో రత్నాంగి • యేమి బల్కితి నీవు
తేటగా జెప్పితివి • తెలివిలేక
యేడు దినములయందు • యేగడియ లేకుండ
యెందుకు వచ్చేది • యమ్మెలాడి
చాతుర్యమంతయు • సొగసుగా పల్కితివి
యిది గట్టితనమచే • భామ నీకు
యేడుదినములయందు • యేజాము లేకుంత
చక్కగా బల్కితివి • పొగసుగాను

దినము వారము లేకుండ • దిట్టముగను
గడియ నిమిషంబు నాకైతె • తెలియరాదు
నన్ను రమ్మని జెప్పితి • వేది వేళ
శీఘ్రముగ జెప్పి పంపవే • సుందరాంగి.

సీ. దాని మోహములోన • దగిలి యుండెడివాడు
రానెట్లు నేర్చునే • రమణులారా!
ఎంచరా దురదృష్ట • మిట్లుండగా నాకు
వాడేల దక్కునో • వనితలార!
బ్రహ్మకే నెపుడైన • పగజేసి యుంటినో
బాధించె గాబోలు • సఖియలార!
విభుని దూరగనేల • వెలది బెట్టిన మందు
తలకెక్కెగాబోలు • తరుణులార!

రాడు నామీద • రేగియున్నాడు నాధు
డలిగి యున్నాడు కాన • మీ రచటి కరిగి
నాదు వెతలెల్ల నెరికించి • నాదు మతిని
రంజిలగ జేసికొనిరారె • రమణులార!

సీ. యేమిరా వైద్యుడా • యిచ్చి పోయిన మాత్ర
యేడేడు సారిగ • బేదులాయె
తైలంబు నొక్కసారి • తలనిండ రుద్దరా
తీపులు పుట్టెరా • తిండిపోత
చూర్ణంబు నొకసారి • సూక్ష్మంబుగా తిన
క్షుద్బాధచేత నే • నోర్వనైతి
కలికంబు నొకసారి • కంటికి వేయగా
కన్ను గుడ్డాయరా • గట్టి వైద్య

వైద్యుడొచ్చిన మాత్రాన • వణకుబుట్టె
నంచి విప్పిన మాత్రాన • చలువగమ్మె
మందుయిచ్చిన మాత్రాన • మాట లణిగె
వోరి నీచేతి మాత్ర • వైకుంఠ యాత్ర.

32 శృంగారపద్యములు

సీ. విషము త్రాగినైన • విడుతుమ ప్రాణంబు
వెలదిరో గడియ • జీవింపజాల
మొగలిరేకును దెచ్చి • మొనమూరి సావపై
హెచ్చుగా రొమ్మున • గ్రుచ్చుకొందు
పండువెన్నెల దిచ్చు • పై గప్పుకొని నాదు
సాహసంబున వేగ • చచ్చుదాన
వెలది నా కంఠంబు వేణి • తోడను జుట్టి
యురిబోసుకొని • మృతి నొందుదాన
ఆకట యింతని వర్ణింప • నలవిగాదు
విరహవేదన కెటులోర్తు • వెలది వినవె
చలువ పన్నీటి కుండలో • సాహసించి
దుమికి ప్రాణంబు విడుతునే • తోయజాక్షి.

సీ. హెచ్చెనే మదనుండు • వచ్చెనే బాణంబు
గ్రుచ్చెనే రొమ్మున • మచ్చెకంటి
వెండెనే భ్రమరములు • పండెనే పయ్యెదలు
దండ లేదయ్యె • వేదండ యాన
కాసెనే వెన్నెల • ల్గాసెనే కోవెలల్
రోసెనే గోర్కెలు • వాసురాంగి
కదలెనే మోహంబు • మెదిలెనే విరహంబు
వదలెనే ధైర్యంబు • మది కరింగె
మదపతులతోడ మాటాడ మనసురాదు
ఫల రసాన్నంబు మీదమ • భ్రాంతిలేదు
ప్రాణనాధుని రూపంబు • భావమునను
[illegible] తెరవేమి • తరళ నయన.

సంపూర్ణము.